శ్రీనంద రామేశ్వర శతకము

Slno. 262

13221

శ్రీ

# ఆనందరామేశ్వర శతకము

ఇది

కొండేపూడి కొండన్నగారిచే

రచియింపంబడియె.

రెండవ కూర్పు.

రాజమహేంద్రవరము.

యస్. గున్నేశ్వరరావు బ్రదర్సువారి

శ్రీచింతామణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపంబడియె.

1912.



# ఆనందరామేశ్వర శతకము

సీ. శ్రీసాంబమూర్తిని సేవించి మ్రొక్కుచు బార్వతీపుత్రుని భక్తిఁ గొలిచి
వాల్మీకిమౌనికి వందనంబులు జేసి బ్రహ్మదేవునిరాణి బ్రస్తుతించి
శ్రీశుకాదులకు నే సేవించి మనమున వ్యాసనారదులకు దోసి లొగ్గి
యాంజనేయాదుల కభివందనము జేసి శంకరాచార్యుల శరణుఁ జొచ్చి
కాళిదాసాదికవులకు కేలు మొగిచి। సీసశతకంబు జెప్పెద భాసురముగ
యిరుసుమండపురాధీశ దురితనాశ। శ్రీమదానందరామేశ చిత్ప్రకాశ.

సీ. నాగభూషణ నిన్ను నమ్మి గొల్చెద నేను నిజముగా నను బ్రోవు నీలకంఠ
భక్తవత్సల నిన్ను భక్తితో సేవింతు వర మిచ్చి కావుము వామదేవ
ఇందుశేఖర నిన్ను నింపుగా బూజింతు గరుణించి నను గావు గరళకంఠ
విశ్వేశ నిన్ను నే వేడ్కతో భజియింతు భయ మెల్ల బాపుము పార్వతీశ
యనుచు నీరీతి భక్తితో ననుదినంబు। శక్తికొలదిగ వేడెద ముక్తికొరకు। యిరుసు॥

సీ. శంకర నీనామసంకీర్తనంబుచే భక్తులందఱు వేగ ముక్తులైరి
శ్రీకంఠ నీపాదసేవ జేసియుగాద ధరణిలో సజ్జనుల్ ధన్యులైరి
పురహర నిను నమ్మి బూజ జేసియుగాద దానులు కైలాసవాసులైరి
ఇందుశేఖర నిన్ను నింపుగా బూజించి భాగ్యవంతులు మోక్షపదవి గనిరి
నీదుమహిమను వర్ణింప నిశ్చయముగ। శేషునకునైన వశమా నె శేషభూష। యిరుసు॥

సీ. కనకంబు దొంగిలించినపాతకంబైన బ్రాహ్మణు జంపినపాపమైన
దుర్దానములు గొన్నదురితజాలంబైన మద్యపానము సేయుమలినమైన
గురుభామ నొందినఘోరదుష్కృతమైన గల్లలాడిన తీవ్రకలుషమైన
గోహత్య జేసినగురుకిల్బిషంబైన విప్రుసొమ్ము హరించువృజినమైన
నిట్టిపాపంబు లేకమై బట్టుకొనిన। బాయు నీనామ భజనచే భస్మమగుచు। యిరుసు॥

సీ. కోపమా లేక నాపాపమా నకృపలోపమా నన్నేలు లోకరక్ష
పంతమా లేక సామంతమా దుబలవంతమా కృప జూడు కంగాహరణ
నేరమా నను బ్రోవ భారమా నీకు నే దూరమా కరుణించు దురితదూర
కష్టమా నీకిది నష్టమా నామురదృష్టమా రక్షించు శిష్టవరద
భక్తవశగమన వని నమ్మి శక్తికొలది। నిన్ను వేడితి నీరీతి నీలకంఠ। యిరుసు॥

# ఆనందరామేశ్వరశతకము.

సీ. ధరణిలోపల నేను బుట్టినప్పటినుండి సత్కార్య మొకటైన సలుపలేదు
తీర్థయాత్రలకైన తిరిగివచ్చెదనంటె పరదేశమున గష్టపడగలేను
యజ్ఞాదికంబులనైన జేసెదనంటె దండిగా నాకును ధనములేదు
[illegible]ణిలో మిముగూర్చి తపముజేసెదనంటె తరుచుగా శ్రమ కేను తాళలేను
[illegible]పుడను గాన మీపాదపంకజములు। భక్తితోగొల్తు నను బ్రోవు భద్రముగను। యి॥

సీ. చుక్కలగమినైన లెక్కసేయగవచ్చు నిసుకరేణువులైన నెన్నవచ్చు
వనధితరంగముల్ గణనసేయగవచ్చు మంచుబిందువులైన నెంచవచ్చు
యమునికింకరులతో నైనబోరగవచ్చు బులిగోరులైనను బుణకవచ్చు
జప్పన్నభాషలు జదివిచెప్పగవచ్చు మృత్యుదేవతనైన మ్రింగవచ్చు
గాని మీమీద మనసొకగడియయైన। నిలుపలేరయ్య మనుజులు నీలకంఠ। యిరుసు॥

సీ. కాళ్ళునొవ్వగ బలుగుట్టముల్ నడుచుచు వారణాసికిబోవ వాంఛవలదు
యుపవాసములతోడ దపము చాలగజేసి భ్రాంతితోడుత గష్టబడుటవలదు
యశ్వమేధాదుల నమితంబుగాజేసి విత్తంబు చాలను విడువవలదు
శీతకాలంబున వాతంబుబాధింప ముక్తికై నదులలో మునుగవలదు
భక్తితో మిమ్ము భజియింప ముక్తిగల్గు। గాని తక్కినకృతములగనదు ముక్తి। యిరుసు॥

సీ. పాయసాన్నంబులు భక్తులందఱికిచ్చి విరివిగా విషము సేవించినావు
పీతకౌశేయముల్ ప్రియజనంబులకిచ్చి గజచర్మమును నీవు గట్టినావు
శయ్యాదికంబులు సజ్జనావళికిచ్చి పణుగుగాతిని నీవు పండినావు
హారహారావళుల్ దాసులందఱికిచ్చి భుజగేంద్రమును నీవు బూనినావు
యిట్టిదాతృత్వ మిలలోన నెందుగలదు। [illegible]కజూచిన నీపాటివేల్పుగలడే। యిరుసు॥

సీ. ధరణిలోపల నన్నదానపరుండైన సత్యవాక్యము బల్కు పరుసుడైన
దీర్ఘయాత్రలకునై దిరుగుపుణ్యుండైన మాతృపూజ నొనర్చు మనుజుడైన
జపనాదియాగముల్ సలుపువిప్రుండైన భూదానములు జేయుపురుషుడైన
సత్పాత్రదానముల్ సల్పుసజ్జనుడైన నుపవాసములు సేయుతపసియైన
జ్ఞానమునునమ్మి మదిలోన గానకున్న। ముందు గల్గునె సాంమ్రాజ్యమోక్షపదవి। యి॥

సీ. గార్ధభంబున కేల కాంచనచేలంబు సూకరంబున కేల చూతఫలము
మాచకమ్మకు కేల మౌక్తికహారంబు సారమేయము కేల సద్వ్రతంబు
రంకులాడికి నేల రంగైనపతిభక్తి మద్యపానుని కేల మంత్రజపము
దుర్జనావళి కేల దొడ్డపురాణం[illegible] కష్టమందున కేల కోమలాంగి
[illegible]త్తిబట్టిన కేటికి వితరణంబు। దుష్టజనులకు మీమీద దృష్టియేల। యిరుసు॥

# ఆనందరామేశ్వరశతకము.

సీ. తనలేమికిని జాలిదైన్యమందగరాదు పరులకల్మికి దుఃఖపడగరాదు
యన్నదమ్ములదాయ మపహరింపగరాదు జారచోరులవెంట జేరరాదు
తనుమున్ను జేసినధర్మముల్ దలపోసి యిచ్చిపోతి నటంచు నేద్వరాదు
యొకడు చేయుసుధర్మ మోర్వలేకను తాను విఘ్నమెన్నడును గావింపరాదు
తాను చేసినధర్మంబు దలపరాదు। భక్తి మీయందు లేకుండ బ్రతుకరాదు। యిరుసు॥

సీ పరభామలను జూచి భ్రాంతి జెందితిగాని యింపుగా మిమ్ము బూజింపనైతి
దుష్టజనంబులతోడ గూడితిగాని శిష్టసాంగత్యంబు జేయనైతి
నభ్యాగతుల జూచి యదలించితినిగాని శక్తితోడుత బూజ సలుపనైతి
వేదాంతులను జూచి వెక్కిరించితిగాని భక్తితో పాదముల్ బట్టనైతి
నిట్టిద్రోహుడ నే గాన నిపుడు నాదు। తప్పు లెన్నక రక్షించు తండ్రివలెను। యిరుసు॥

సీ. అభ్యాగతుల జూచి యాదరించుచు భక్తి నన్నంబు బెట్టినయత డొకండు
తల్లిదండ్రులకును దైన్యము లేకుండ వార్ధక్యమున బ్రోచువా డొకండు
పెండిలి గాకున్న పేదభూసురునకు వైవాహికము జేయువా డొకండు
శిథిలమైయున్నట్టి శివ నీదుభవనంబు సరవిగా గట్టించుసరసు డొకడు
నిట్టిపుణ్యులు మిము జేరి గట్టిగాను। ధన్యులగుదురు జగతిలో దాసపోష। యిరుసు॥

సీ. ముదిమి చాలగ గల్గి మూల్గుచుండెడువేళ బలువైనరోగముల్ గలుగువేళ
గుత్తుక శ్లేష్మంబు గూడియుండెడువేళ నన్నంబు హితవు లేకున్నవేళ
నూహించి చూడంగ దేహవిస్మృతివేళ గాలకింకరులను గనెడువేళ
వడితోడ దేహంబు వడకుచుండెడువేళ దనువులో ప్రాణముల్ దాటువేళ
నిన్ను నే నెట్లు భజియింతు నీలకంఠ। నాటికిప్పుడె మిము గొల్చినమ్మినాను। యిరుసు॥

సీ. కర్ణామృతంబుగా ఘనమైన నీకథల్ బొగడుచుండగ లేచిబోవునతడు
నేత్రోత్సవంబుగా నిన్ను బూజింపంగ తృణమైన నచట నిల్వనియతండు
సజ్జనావళి మిమ్ము స్మరణసేయగ జూచి వీనుల కింపుగా విననియతడు
భక్తవర్యులు నిన్ను భజియింపగా మది సహ్యంబు లేకను జరుగునతడు
ఇట్టిదుర్జను లెల్లను గట్టిగాను। బాధపడుదురు యమునిచే బరమునందు। యిరుసు॥

సీ. ముక్తి జెందుటకు నే భక్తి గొల్చితిగాని ధరణిలో గొప్పకై దలచి గాదు
మోక్షంబుకొరకు నే మ్రొక్కి వేడితిగాని భువిలోనజనుల మెప్పులకు గాదు
సాయుజ్యమునకు నే సన్నుతించితిగాని విరివిగా ధనముకోసరము గాదు
జన్మనాశనమునకై స్మరణజేసితిగాని బలువుగా భోగసంపదకుగాదు
ధర్మచింతనకెప్పుడు దగిలియుండు। గాన వరమిచ్చి బ్రోవుము కష్టమునకు। యిరుసు॥

# ఆనందరామేశ్వరశతకము.

సీ. ద్రోహుండ వని నన్ను దూరఁ జాడిన నేమి దీనుఁడ వని చాల దిట్టి రేమి
భ్రష్టహీనుఁడ వని వెక్కిరించిన నేమి వెంబడించియు మాఱి విరిచి రేమి
యల్పుండ వని నన్ను హాస్య మాడిన నేమి నారీతి గన్గొని నవ్వి రేమి
రచ్చలందున నన్ను రవ్వ జేసిన నేమి పాపుఁడ వని నోట బల్కి రేమి
కుటిలిని రెప్పవలె నీవు గాచియుండ। నరులసంగతి నా కేల నాగభూష। యిరుసు॥

సీ. అధికారమునకు ని న్ననుసరింపగ లేదు విద్యార్థమై నిన్ను వేడలేదు
భూమి యిమ్మని చాలభూషింపగా లేదు ద్రవ్య మిమ్మని నిన్ను దలపలేదు
సుతుల నిమ్మని చాలనుతులు సేయగలేదు యన్న మిమ్మంచు ని న్నడుగలేదు
పసుల నిమ్మని చాల బాధపెట్టగ లేదు భోగ మిమ్మని నిన్ను బొగడలేదు
నాముకోర్క నెరవేర్చి నీదుపాద। భక్తి నొసగిన చాలును ముక్తికొరకు। యిరుసు॥

సీ. శ్రీకంఠ నీపాదసేవ చేసిన వేగ దుఃఖసంఘము లెల్ల దొలగిపోవు
శ్రీకంఠ నీపాదసేవ చేసిన వేగ పాపజాలము లన్ని భస్మ మగును
శ్రీకంఠ నీపాదసేవ చేసిన వేగ బలువైన రోగముల్ దలగుచుండు
శ్రీకంఠ నీపాదసేవ చేసిన వేగ గర్భదారిద్ర్యముల్ గడచి చను
నిఖిలజనులకు భువిలోన నీదుపాద। సేవకన్నను వేఱగు త్రోవ గలదె। యిరుసు॥

సీ. పరకాంతలను జూచి భ్రాంతి జెందుటకంటె నవనిలో జాత్యంధు డగుట మేలు
యన్నదమ్ములభాగ మపహరించుటకంటె నెంచగా విషము భక్షించ మేలు
నీభక్తవరులను నింద జేయుటకంటె నగ్నిలో బడి దగ్ధ మగుట మేలు
యగ్రజన్ములభూము లపహరించుటకంటె కూటికై ము ష్టెత్తుకొనుట మేలు
త్యాగి దుర్మార్గపనులను జేయుకంటె। విశ్వమందున ప్రాణముల్ విడువ మేలు। యిరుసు॥

సీ. అవనిలో జనులందు నతిలుబ్ధ డగువాడు బీదవాళ్ళకు దాను భిక్ష మిడడు
తా బెట్టకున్నను దలపులోపలనైన నొరులు జేసెడు ధర్మ మోర్వలేడు
ధర్మంబు జేసెడి దాతయొద్దకు జేరి యెన్ను మెప్పులను గావింప గోరు
ఫలవిఘాతంబైన బలుసంతసము నొందు స్థిరముగా ఫలమైన చింత నొందు
ఇట్టిదుర్మార్గరతు డగునట్టివాడు। శిక్ష నొందును యమునిచే సిద్ధముగను। యిరుసు॥

సీ. నీనామమే మాకు నిజముగా మోక్షంబు నీనామమే మాకు నిఖిలధనము
నీనామమే మాకు నిండైన గ్రాసంబు నీనామమే మాకు నిఖిలజపము
నీనామమే మాకు నిత్యసంతోషంబు నీనామమే మాకు నిఖిలసుఖము
నీనామమే మాకు నిత్య మానందంబు నీనామమే మాకు నిత్యపదవి
గాన నీనామకీర్తన గరుణతోడ। సంతతము నాకు దయసేయు శక్రవినుత। యిరుసు॥

సీ. నీనామమేకదా నిఖిలజీవుల కెల్ల సాయుజ్యపదవికి సాధనంబు
నీనామమేకదా నిఖిలలోకములకు మూలమంత్రం బయ్యె మోక్షమునకు
నీనామమేకదా నిఖిలమానవులకు నఖిలార్థసిద్ధికి నాలయంబు
నీనామమేకదా నిజముగా జూడంగ నఖిలరోగములకు నౌషధంబు
మారశతరూప నీనామమహిమ దలిసి। భజన చేసినవారికి పరమసుఖము। యిరను

సీ. నాగభూషణ నీదు నామమంత్రము చేత భక్తు లందరు వేగ ముక్తులైరి
నాగభూషణ నీదు నామమంత్రము చేత పరమహంసలు మోక్షపదవి గనిరి
నాగభూషణ నీదు నామమంత్రము చేత దాసు లందరు వేగ ధన్యులైరి
నాగభూషణ నీదు నామమంత్రము చేత భాగ్యవంతులు మోక్షపదవి గనిరి
శైలజాధీశ నీనామ జపముకంటె। విశ్వమున మంత్రరాజంబు వేరె గలదె। యిరను॥

సీ. శ్రీమహాదేవ నీకా జిత్తంబులోపల స్మరణ చేసెడివారిచరణమ్ములకు
వందనంబులు చేసి వరసగా బూజింతు నిన్ను వేడనివారి నే స్మరింప
నీభక్తవరులను నింద జేసెడివారిచెంత కెప్పుడు నేను చేరబోను
సర్వజ్ఞుల మటంచు గర్వాంధు లగువారి నిజరూపనామముల్ నే దలంప
వసుధలోపల నీభక్తవరుల కెల్ల। దాసుడను నన్ను ర[illegible]ంచు ధన్యచరిత। యిరను॥

సీ. ఇభవక్త్రజనక ని న్నెంత వేడినగాని కరుణజూడ వదే[illegible]కారణంబు
భక్తితో ని న్నెంత భజన జేసినగాని హితవుగా వినకున్న హేతు వేమి
పలుమారు ని న్నెంత బల్కరించిన గాని మారు బల్క వదేమి మానవృత్తి
ముదముతో నీ కెంత మ్రొక్కు వేసిన గాని కండ్ల జూడ వదేమి కపటబుద్ధి
ముక్తిదాయక నావంటి మూర్ఖజనుని। బాధ పెట్టిన నీ కేమి ఫలము గలుగు। యి॥

సీ. కలపాటి యతిథిసత్కారంబు సేయక దాతయే గడుదున్నపోతు గాక
తల్లిదండ్రుల చాల దాడిచేసినవాడు సుతు డౌనె బహుపాపరతుడు గాక
పతితోడ కలహించి పలుమారు సేడ్చిన సతి యౌనె దుర్మార్గవతియు గాక
సాధుసంరక్షణ సలుపకుండినవాని పదవియే దౌర్భాగ్యపదవి గాక
శక్తికొలదిగ నిను బూజసలుపకున్న। జనుడు ఘనుడౌనె నతడు దుర్జనుడు గాక। యి॥

సీ. ఉదయమందున లేచి యొప్పుగా నని కేగి మునురున చలినీట మునుగువారు
ముక్కులు బిగబట్టి ముఖ్యకాలంబున సంధ్యాదికృత్యముల్ సలుపువారు
సమిధ లాజ్యముతోడ సమకూర్చి వహ్నిలో వెలుగుచు హోమంబు చేయువారు
నతిథిసత్కారంబు లాచరింపుచు వైశ్వదేవాదికంబులు దీర్చువారు
ఫాలలోచన శంకర భక్తి నిన్ను। గొలుచువారలకన్నను గొద్దివారు। యిరను॥

సీ॥ కవితారసజ్ఞత గలుగుపాత్రుం డెరుగునే యెరిగిన సరసజ్ఞు డెరుగుగాని
పతిరతిసౌఖ్యంబు షండుం డెరుంగునే యెరిగిన యువజనుం డెరుగుగాని
గురుగర్భవేదన గొడ్రా లెరుంగునే యెరిగిన సుతవతి యెరుగుగాని
సాహితీచతురత బాల్యుం డెరుంగునే యెరిగిన విద్వాంసు డెరుగుగాని
యొప్పి నెరిగిన నీభక్తు డెరుగుగాని। మూర్ఖు డెటువలె నెరుగును ముక్తిమహిమ। ఆ॥

సీ. విద్య నేర్పుట చాల విత్తార్జనంబుకే భూములార్జించుట భుక్తికొరకె
సతి పెండ్లియాడుట సౌఖ్యకరంబుకె సుతుల గనుటను మంచి గతులకొరకె
విత్త మార్జించుట విభవాభివృద్ధికే పసుల నార్జించుట పాడికొరకె
భూము లిచ్చుట గొప్ప పుణ్యచయంబుకే నగలు ధరించుట సొగసుకొరకె
ఇతరకార్యంబులందున నిచ్ఛ మాని। భక్తితో మిమ్ము గొల్చుట ముక్తికొరకె। ఆ॥

సీ. విశ్వేశ నీకథల్ వినియుండుటే చాలు కర్ణద్వయంబును గలుగుఫలము
సురపూజ్య నీమూర్తి జూచియుండుటె చాలు కర మొప్ప నేత్రముల్ గలుగుఫలము
గజవైరి నీపూజ గావించితే చాలు గరిమతో హస్తముల్ గలుగుఫలము
శివ నీదుకీర్తన జేసియుండుటె చాలు వల నొప్ప నాలుక గలుగుఫలము
మనములో నిన్ను సతతంబు మరవకున్న। జగతిలోపల గలుగును జన్మఫలము। ఆ॥

సీ॥ పద్మభవార్చిత పాదారవిందాయ మలినదూరాయ నమశ్శివాయ
భుజగేంద్రభూషాయ భూరిప్రభావాయ మదనాంతకాయ నమశ్శివాయ
రజతాద్రివాసాయ రాజితసుగుణాయ మౌనిపూజ్యాయ నమశ్శివాయ
గజచర్మవస్త్రాయ కలుషవిఘాతాయ ఫాలిచంద్రాయ నమశ్శివాయ
మంజుభాషాయ తుభ్యం నమశ్శివాయ। యనుచు మ్రొక్కెదు నీరీతి ననుదినంబు। ఆ॥

సీ. రాజులలోన శ్రీరామచంద్రుడు మేలు గిరులలో మేరుభూధరము మేలు
యఖిలదానములలో నన్నదానము మేలు తరువులలో గల్పతరువు మేలు
యఖిలవర్ణములలో నగ్రవర్ణము మేలు మృగములలో సింహమృగము మేలు
యఖిలసర్పములలో నాదిశేషుడు మేలు గ్రహములలో దివాకరుడు మేలు
స్త్రీలలోపల జగతిలో సీత మేలు। దేవతలలోన శంకర నీవు మేలు। ఆనం.

సీ. శ్రీకంఠ నీసేవ జేయంగ నావంతు నిజముగా రక్షింప నీదివంతు
సతతంబు నీపూజ సలుపంగ నావంతు నిరతంబు నను బ్రోవ నీదివంతు
భక్తితో డుత నిన్ను భజియింప నావంతు నిశ్చయంబుగ గావ నీదివంతు
వరపగా నీకీర్తి వర్ణింప నావంతు నిత్యంబు కరుణింప నీదివంతు
[illegible]ముగా నీకు మ్రొక్కుట నాదివంతు। నిత్యపద మిచ్చి బ్రోచుట నీదివంతు। ఆ॥

# ఆనందరామేశ్వరశతకము.

సీ. నీనామరుచిఁగొన్న నీపాదభక్తుండు పాలు మీగడలకు భ్రాంతిపడఁడు
నీనామరుచిఁగొన్న నిశ్చలుం డెప్పుడు మధుశర్కరలపైన మనసుపడఁడు
నీనామరుచిఁగొన్న నీదాసవరు డెప్పు డతిరసాదులమీద నాసపడఁడు
నీనామరుచిఁగొన్న నీసేవకుండు తా మోచాఫలంబులపై మోహపడఁడు
నీదునామంబురుచిఁగొన్న నిర్మలుండు। నితర రుచులకు నెప్పుడు నిచ్ఛపడఁడు। ౮

సీ. శైలజానాథాయ చంద్రార్ధమకుటాయ భవ్యరూపాయ తుభ్యం నమోస్తు
భుజగకేయూరాయ పురదైత్యహరణాయ భక్తపాలాయ తుభ్యం నమోస్తు
కైలాసవాసాయ కమనీయగాత్రాయ పరమేశ్వరాయ తుభ్యం నమోస్తు
వాసవాదిత్యాదివందితచరణాయ ఫాలనేత్రాయ తుభ్యం నమోస్తు
భక్తజనసేవితాయ తుభ్యం నమోస్తు। యనుచు భజియింతు నీరీతి ననుదినంబు। ౯

సీ. చరమకాలంబున శ్రమచేత నిన్ను నే స్మరణ జేతునో లేదొ మరువ కిపుడె
జేతు నీస్మరణను జెలగుచు నిత్యంబు కోటిమన్మథరూప కోమలాంగ
శంభో మహాదేవ శంభో మహాదేవ శంభో మహాదేవ చంద్రజూట
శ్రీకంఠ శ్రీకంఠ శ్రీకంఠ సర్వజ్ఞ హరినుత సూర్యచంద్రాగ్నినేత్ర
యనుచు నీరీతి నీనామ మనుదినంబు। భజన చేయుచునుందు నాభావమందు। ౧౦

సీ. పుడమిలోపల నేను బుట్టినందుకు నీదు సంతతస్మరణ సేయ సలుపనైతి
జగతిలోపల నేను జనియించినందుకు సద్భక్తి మీపూజ సలుపనైతి
నుర్విలోపల నేను నుదయించి భక్తితో పలుమారు మీకథల్ బలుకనైతి
భూమిలో జన్మించి బుద్ధిహీనుండనై చిత్తంబు మీయందు జేర్చనైతి
గాల మీరీతి వ్యర్థంబు గాగ జేసి। మోహమోయితి గరుణింపు దాసపోష। ౧౧

సీ. పద్మభవస్తోత్ర పావనచారిత్ర పక్షివాహనమిత్ర ఫాలనేత్ర
సద్భక్తమందార సాగరగంభీర మందరాచలధీర మలినదూర
కోటిమన్మథరూప గోత్రాధిపతిచాప పరమపావనరూప ప్రళయకోప
శశిమౌళిభూషణ శత్రుసంహారణ గజచర్మధారణ కలుషహరణ
భక్తజనపోష జగదీశ పార్వతీశ। దీనపోషక నను బ్రోవ దిక్కు నీవె। ౧౨

సీ. పాడిగోవుల కోట్లు పదివేలొసగిన నింతైన నీపూజ కీడు రాదు
చయనాది మఖకోట్లు సల్పినప్పటికైన నింతైన నీపూజ కీడు రాదు
దివ్యతీర్థము లెన్ని దిరిగివచ్చిన గాని నింతైన నీపూజ కీడు రాదు
గ్రహణపర్వములందు గజము లెన్నిచ్చిన నింతైన నీపూజ కీడు రాదు
గాన నీపూజమహిమను గాంచి పొగడ। బ్రహ్మకైనను శక్యమే పార్వతీశ। ౧౩

సీ. పాలు మీగడ లేని పంచదారలకంటె రుద్ర నీనామమే రుచికరంబు
బదరిజంబూద్రాక్షఫలరసంబులకంటె రుద్ర నీనామమే రుచికరంబు
పనసచూతకపిత్థఫలరసంబులకంటె రుద్ర నీనామమే రుచికరంబు
నవసుధాపరమాన్ననవనీతములకంటె రుద్ర నీనామమే రుచికరంబు
రుద్రనీనామభజనచే భద్రముగను। బరమపురుషులు కైవల్యపదవి గనిరి। యిరుసుం.

సీ. నీభక్తి లేనట్టి నీచునిజన్మంబు తామసుండై చేయు తపసి జపము
పతిభక్తి లేనట్టి సతి చేయు వ్రతములు విత్తంబుకొరకైన వేదపఠన
వ్యగ్రచిత్తుడు చేయు నుగ్రమంత్రజపంబు దుర్మార్గునకు నిచ్చు దొరతనంబు
కనకంబు గొని చేయు కన్యకాదానంబు సంతతిలేని సంసారసుఖము
భక్తిలేకుండ చేయు మీపాదపూజ। వ్యర్థములుగాని జగతిలో సార్థమగునె। యి.

సీ. శ్రీసాంబశివ నిన్ను చిత్తంబులోపల భక్తితో భజియించు భవ్యులకును
పురదానవాంతక భువి నిన్ను నిరతంబు బూజించునట్టి యాపుణ్యులకును
నిర్మలంబైన నీనిజరూపవిభవంబు జూడగల్గిన మహానుజనులకును
చంద్రఖండోత్తంస సతతంబు నీనామ భజనగావించెడి భక్తులకును
సర్వదా నిన్ను గొనియాడుసరసులకును। మోక్షమరచేతిదై యుండుమోదమొప్ప। యి.

సీ. నీమహిమాంతంబు నే నెరుంగక చేయు స్తుతి యసదృశమని దోచెనేని
వట్టివైన జగత్తులో నధికంబుగా జేయు స్తుతులెల్ల నవసన్నగతులుగాన
వంభోజజాతాదు లాత్మబుద్ధిగొలంది వలనొప్ప స్తుతియించువారుగాని
నీమహిమాంతంబు నిజముగా నెరిగియు వర్ణింపగలిగినవారు గారు
గాన మది దోచినటుల నీకరుణకొరకు। సన్నుతించితి నన్నేలు శక్రవినుత। యి.

సీ. భుక్తిలోసమెగదా భువిలోన జనులకు దాసత్వములు చేయ దలపవలసె
దారాసుతభ్రాంతి దగిలియుండగ గదా చేరి నీచుల సేవ జేయవలసె
ధరణిలో జన్మంబు దగలకుండగ గదా సతతంబు మీపూజ సలుపవలసె
గురునిమంత్రంబును గోరకుండగ గదా యజ్ఞానవార్ధిలో నణగవలసె
గాన సంసారవారధి గడపి నన్ను। ముక్తునిగ జేయు వేగమే భక్తవరద। యి.

సీ. రాతిలో కప్పకు మేత నెవ్వ డొసంగె మృగజాతి నెవ్వడు మేపి పెంచె
నడవిపక్షుల కెవ్వ డాహార మొసగెను పసుల కెవ్వడొసంగె పచ్చిపూరి
స్త్రీలగర్భములందు శిశువుల నెవ్వడు పెంచె నడవిమల్లెకు నెవ్వడప్పు లొసగె
జలచరాదులకు భోజన మెవ్వ డొసగెను యగచరంబుల కెవ్వ డశన మొసగె
ప్రాణికోటుల రక్షించి భయము బాప। శర్వమందున నీకన్న నెవ్వ గలడె। యి.

సీ. మాతృగర్భమునుండి మహిలోన జనియించి సుకృతకార్యము లన్ని సున్న జేసి
దొరిగుండి కొన్నియు నెరుగక కొన్నియు బహుళ మార్జించితి పాతకములు
యనుభవించెదు కాల మతికష్టతరమని పండితుల్ బలుకంగ భయము దోచె
నివి నశించుట కిప్పు డేమైన ధర్మంబు సలుప నా కేమియు శక్తిలేదు
నందివాహన నీచాటు జెందినాను। దురితములు ద్రుంచి నన్ను నీదరికి జేర్చు। ఆను॥

సీ. నీమహిమాంతంబు నిగమాంతవేద్యంబు ప్రస్తుతింపంగను బ్రహ్మవశమె
నీకీర్తి గొనియాడ నిశ్చలులైనట్టి శేషాదులకు శక్తి జేరగలదె
నీనామమధురంబు నీభక్తసేవ్యంబు సారసాక్షునికైన సాధ్య మగునె
నీప్రతాపము గాంచి నిజముగా వర్ణింప వేయుగన్నుల గలవేల్పు వశమె
విషయభోగంబులను జనుల్ విఱ్ఱవీగి। పరమపావననామంబు బలుకలేరు। యిరుసు॥

సీ. బహుజన్మములు నెత్తి బాధ జెందుటకంటె గజవైరి గని ముక్తి గనుట మేలు
పెక్కేండ్లు జీవించి ప్రుక్కుచుండుటకంటె నదీశు గని మోక్ష మంద మేలు
బహుదుఃఖసంసారబడబాగ్ని బడుకంటె శివు గొల్చి సౌఖ్యంబు జెంద మేలు
దుష్టసేవలు జేసి కష్ట మందుటకంటె హరు గొల్చి రజితాద్రి కరుగ మేలు
తనువు తథ్యంబు గాదని తత్త్వవిదులు। నిన్ను సేవించి గొల్చిరి నీలకంఠ। యిరుసు॥

సీ. పతితుల జేపట్టి పాలించుటది కీర్తి దుర్జనావళి బ్రోవ దొడ్డకీర్తి
బహుదరిద్రుల కెల్ల భాగ్య మిచ్చుట కీర్తి దీనుల బ్రోచుట దివ్యకీర్తి
శరణు జొచ్చిన గొప్పవరము లిచ్చుట కీర్తి భక్తసంరక్షణ భవ్యకీర్తి
మూర్ఖుల రక్షించి ముక్తి నిచ్చుట కీర్తి కుజనసంగము బ్రోవ గొప్పకీర్తి
గాన నపరాధి బహుపాపకలితు నన్ను। తప్పకుండంగ బ్రోచుట ధన్యకీర్తి। యి॥

సీ. కామదాయిని యైన కామధేనువు గల్గ బాడిగోవులపైని భ్రాంతి యేల
కామితార్థము లిచ్చు కల్పవృక్షము గల్గ మధురఫలములపై మనసదేల
మరణంబు లేకుండ మధురామృతము గల్గ సిద్ధౌషధములపై చింత యేల
కాంచనాద్రియు మస్తకంబుక్రిందను గల్గ భూషణావళులకై బోరలనేల
నిజముగా మోక్ష మివ్వంగ నీవు గల్గ। నితరదైవంబులను గొల్వ నిచ్ఛ యేల। యి॥

సీ. కపిలగోవులకోటి గ్రహణపర్వమునందు దానంబు జేసిన దాతకైన
పుష్కరయుత మైనపుణ్యతీర్థమునందు భూదానములు జేయు పుణ్యుకైన
గంగాత్రివేణ్యాదిఘనతీర్థముల కేగి మజ్జనం బొనర్చించు మనుజుకైన
నశ్వమేధాదుల నమితంబుగా జేయు యజ్ఞకర్తకు సోమయాజికైన
భక్తి నీనామ మొకమాఱు భద్రముగను। బలుకువారికి సమ మైనఫలము లేదు। యి॥

సీ. నీదాసుడ నని యంటి నిర్వహించు మటంటి పార్వతీనాథ మాంపాహి యంటి
దీనుడ నని యంటి దిక్కు నీ వని యంటి సతతంబు నన్నేలు సాంబ యంటి
భక్తపూజ్యుడ వంటి పాలించుదొర వంటి పాతుమాంహరమృగపాణి యంటి
పాపపాతకుడ నంటి పతితపావన యంటి దుష్కృతంబులు వేగ ద్రోలు మంటి
ప్రాణికోటుల కెల్లను ప్రభుడ వంటి। నన్ను బ్రోచుట నీ కిది న్యాయమంటి। యి॥

సీ. నిన్ను నే భక్తితో నెంత వేడినగాని నీ కేల దయరాదు నీలకంఠ
ప్రేమతో ని న్నెంత బిలచినప్పటికైన నూమోరు బల్క వదేమి నేరమయ్య
తండ్రికి నేరముల్ తనయులు జేసిన నిమిషకోపమె గాని నిల్వబోదు
మరుగు జొచ్చిన నన్ను మన్నించకుండిన దిక్కు నా కెవ్వరు దీనపోష
తండ్రివిని నీవె జగతిలో దైవ మీవె। దాతవును నీవె నాకును ధరణిలోన। యి॥

సీ. అన్యులవిత్తంబు లపహరింపగ నేర్తు బీదల కన్నంబు బెట్ట నేర
బరులభామినుల నే బల్మిబట్టగ నేర్తు బరకాంత లాపదల్ బాప నేర
బరులను భంగించి బాధపెట్టగ నేర్తు సాధుల కుపకృతి సలుప నేర
బరులకల్మికి దుఃఖపడగ నేర్తును గాని దీనులకష్టముల్ దీర్ప నేర
నిట్టిపాపంబు లెల్లను గట్టి గాను। పరిహరించియు నన్ బ్రోవు పార్వతీశ। యి॥

సీ. పరకామినుల జూచి భ్రమను జెందితి గాని శ్రీకంఠ మీసేవ జేయనైతి
పరులవిత్తములపై భ్రాంతి జెందితి గాని చెలగి మీపాదముల్ గొలువనైతి
పరులనిందయు జేయ పరుగులెత్తితి గాని శ్రీసాంబ మీపూజ జేయనైతి
నర్థులకీయకుండ హాని జేసితి గాని విశ్వేశ మిమ్ము నే వేడనైతి
గలసి వర్తింతు నింకను తెలివి గల్గి। దుష్టులను బాపి రక్షింపు పరమపురుష। యి॥

సీ. వాసుదేవస్తోత్ర వామభాగకళత్ర సజ్జనావళిమిత్ర సచ్చరిత్ర
భక్తపూజితపాద ప్రళయశంఖనినాద పార్వతీకృతమోద భయవిభేద
కరిదైత్యమదభంగ కరుణారసాపాంగ ఖగశశాంకరథాంగ కలుషభంగ
ఫణిరాజభూషణ భక్తాఘపోషణ శశిమౌళిధారణ శత్రుహరణ
దీనజనపోషవిశ్వేశ దివిజతోష। సాదరంబుగ నను బ్రోవు వేదవేద్య। యి॥

సీ. జగతిలో కొన్నాళ్ళు జంతుజాలమునందు బుట్టుచుండియు నేమి పుణ్యముననో
మానవజన్మంబు మరి యెత్తి కొన్నాళ్ళు యున్నివర్ణములందు నమరబుట్టి
నీకటాక్షము చేత నిజముగా నిప్పుడు భూసురజన్మంబు బొందినాను
ఇపుడు నే మీనామ ముపదేశమును బొంది నిన్ను జేరెద నయ్య నీలకంఠ
ధర్మశాస్త్రంబు లన్నియు దరచి చూడ। దేవ నీసేవకంటెను త్రోవలేదు। యి॥

సీ. కరటికుంభములపై నురుకు సింగపుపిల్ల జూచునే బహునీచశునకములను
కాలాహులను బట్టి కబళించు గరుడుండు పరుగులెత్తునె వానపాములకును
మందారమధుపానమత్తసారంగంబు పోవునే పల్లేరుపూలకడకు
పరిణతసహకారఫలరసంబును గ్రోలుచిలుక యుమ్మెత్తల జేరజనునె
నీదుమహిమను గనుగొన్న నిర్మలుండు । నితరవేల్పుల గొనియాడ నిష్టపడునె ।యి॥

సీ. అర్థులందరికంటి కగపడకుండంగ కొండమీదికి నెక్కి పండినావు
యాచకావళి నిన్ను జూచి వేడకయుండ కాలభైరవదేవు నేలినావు
భక్తసంఘమ్ము సమీపమునకు రాకుండ భుజగేంద్రముల నీవు పూనినావు
కమలాక్షునకు నైన సముఖము గాకుండ నగ్గాంగజానిపై యమరినావు
ఇట్టివాడవు గాన నే నెట్లు నిన్ను । గన్నులను జూచి మ్రొక్కుదు గరళకంఠ ।యి॥

సీ. భుజగేంద్రభూష నీభుజపరాక్రమ మెల్ల వసుధలో మృత్యుదేవతకు నెరుక
నాగేంద్రహార నీనామమాధుర్యంబు సకలంబు పరమహంసలకు నెరుక
చంద్రశేఖర నీదు చరణసాన్నిధ్యంబు ధరణిలో దశకంఠదనుజు కెరుక
నిజముగా నీఫాలనయనప్రభావంబు శంబరాంతకపంచశరుని కెరుక
శేషభూషణ నీపాదసేవకులకు । మోదకరమైన సామ్రాజ్యమోక్ష మెరుక । యి॥

సీ. తనువులో ప్రాణముల్ దాటుచుండెడు వేళ మనసులోపల నిన్ను మరువకుండ
ప్రణవపంచాక్షరి పఠన జేయుచు నిన్ను ధ్యానంబు జేసిన జ్ఞానఘనుడు
నిమిషంబులో నీదు నిలయంబు జేరును యమలోకమున కేగి శ్రమను పడడు
బహుజన్మకృతపుణ్యపరిపాకవశమున సజ్జనసాంగత్యసరణిచేత
నీదుమోక్షంబు జెందంగ నేర్చు గాని । యిచ్ఛనకు ముక్తి దొరకుట దుర్లభంబు ।యి॥

సీ. జగతిలో నాదగు జన్మవృత్తాంతంబు విన్నవించెద మీకు విశదముగను
యవనిలో కొన్నినా ళ్ళజ్ఞానవశమున నాటపాటలచేత నాడుచుంటి
తరువాత కొన్నాళ్ళు తరుణీరతుండనై మదముచే దేహంబు మరచియుంటి
పిమ్మట కొన్నాళ్ళు ప్రియురాలితో సంసారవార్ధిలోపల జిక్కి మునిగియుంటి
జేరితిని నేడు నీపదాంభోరుహముల । నిర్మలాత్మునిగా జేయు నిగమవేద్య । యి॥

సీ. ధరణిధన్వంతరి దయ చాల్ల గల్గితే దేహజాడ్యము లెల్ల దీరునట్లు
రక్షింప దాతయౌ రాజును గనుగొన్న దీనత్వ మెల్లను దీరునట్లు
సద్గురూత్తముదయ సతతంబు గలిగిన జేరి ముక్తికి త్రోవ జెప్పునట్లు
కల్పభూజంబుల కడ కరిగి జేరిన కోరిన కోరికల్ [illegible]యునట్లు
నీకటాక్షంబు నాయందు నిండుగాను । గల్గియున్నను మోక్షంబు గాంతు నేను ।యి॥

సీ. దేహ మస్థిర మని తెలియజాలగ లేదు యించుక నీమాయ నెరుగ లేదు
మూఢవస్థలలోన మునిగి తేలగ లేదు వనితలపై వాంఛ వదల లేదు
కామాదిషడ్వర్గకము జయింపగ లేదు నీయందు సద్భక్తి నిలుప లేదు
యభిమానరహితుడై యాస మానగ లేదు తాను బ్రహ్మ మటంచు దలప లేదు
బుద్ధిహీనుండు మూర్ఖులపొందు గూడి। భ్రష్టుడై పోవు నుర్విలో గష్టపడుచు। యి॥

సీ. ఘటము దా నెంతయు గాపాడినను గాని మరణకాలంబున మడిసిపోను
ఘనవైద్యు లెందరు గల్గినప్పటికైన మరణకారణవ్యాధి మాన్ప లేరు
తల్లిదండ్రులు సతీతనయు లాప్తులు గూడి ప్రాణముల్ బోకుండ బట్ట లేరు
కోట్లకొద్దిధనంబు గూడబెట్టినగాని గుడ్డిగవ్వైనను గూడరాదు
ధరణిలో దాను జేసినధర్మ మొకటె। వదలకుండ సహాయ్యమై వచ్చుగాద। యి॥

సీ. పరమేశ నావంటిభక్తజనంబులు కోటిసంఖ్యలు మిమ్ము గొలుచుచుండ
దండిగా భక్తులు దగిలి యుండుటచేత మరచిపోకుము నన్ను మానివంత్య
పదిమందిలో నన్ను భక్తునిగా నెంచి పాలించు వేగమే భక్తవరద
శరణు జొచ్చితి మీదుచరణంబులకు మ్రొక్కి కరుణించి నన్ బ్రోవు గరళకంఠ
భక్తజనపోష జగదీశ భవవినాశ। పార్వతీశ్వర విశ్వేశ పరమపురుష యి॥

సీ. పలుమారు మీకథల్ పలుకుచుండెడువాడు పరుషవాక్యము లేమి పలుకబోడు
భక్తితో మిమ్మును భజనజేసెడువాడు నన్నృతవాదము లేమి నాడబోడు
ముక్తికొరకును మీకు మ్రొక్కి కొల్చెడువాడు భక్తిహీనులతోడ బలుకబోడు
యాసక్తిచే మిమ్ము ననుసరించెడువాడు దుష్టసంగతి కెన్న డిష్టపడడు
ఇన్ని మనమున నమ్మిననీతిపరుడు యెన్నడ్వేల్పుల గొనియాడ నిచ్ఛపడడు। యి॥

సీ. తల్లివైనను నీవె దండ్రివైనను నీవె దైవమైనను నీవె ధన్యచరిత
క్రూరాత్ము డని నన్ను కోపించి వీడక తప్పు లన్ని క్షమించు దాసపోష
మోక్షంబుకొరకును మ్రొక్కినందుకు చాల చేపట్టి నను గావు శేషభూష
నీకటాక్షమునకు నేను పాత్రుండనై కొలుచుచుంటిని మిమ్ము కోర్కె లలర
ముక్తిదాయక నావంటి మూర్ఖజనుని। తప్పకుండగ బ్రోచుట గొప్పకీర్తి। యి॥

సీ. శంకరగౌరీశ, చంద్రశేఖరసాంబ పార్వతీశ మహేశ భవవినాశ
పద్మభవార్చిత పరమేశ జగదీశ భక్తవత్సలకోటిభానుతేజ
దాసపోషకమృత్యుదర్పవిభంజన గజదానవాంతకకలుషహరణ
సద్భక్తమందార సాగరగంభీర త్రిపురాసురాంతక దివిజపోష
ఘోరశతకోటిసమరూపఘోరరూప। దీనపోషక నను బ్రోవ దిక్కు నీవె। యి॥

సీ. గగనంబుపై కెక్కఁ గంతులేయఁగవచ్చు నబ్ధిలోపల నీదులాడవచ్చు
పర్వతంబులఁబట్టి బంతులాడఁగవచ్చు గాలమృత్యువుకైన దోలవచ్చు
పుడమి చక్రముఁ గాఁగ బూని చేయఁగవచ్చు దప్తలోహంబైన ద్రావవచ్చు
పద్మభవాండముల్ పగలఁగొట్టఁగవచ్చు బడబాగ్ని భక్షించి బ్రతుకవచ్చు
పుడమిలో మూర్ఖులకు జ్ఞానబోధ తెలుప। బ్రహ్మకైనను వశమౌనె పార్వతీశ। యి॥

సీ. సర్వశాస్త్రంబులు సాధింపఁగావచ్చు గోట్లకొలఁది ధనంబు గూర్చవచ్చు
నవనిలో పనులెల్ల నభ్యసింపఁగవచ్చు గనకంబుతో గుళ్లు గట్టవచ్చు
గామాదిషడ్వర్గకము జయింపఁగవచ్చు దీర్ఘయాత్రల కెల్ల దిరుగవచ్చు
నీషణత్రయముపై నిచ్చ మానఁగవచ్చు సద్వాక్యంబులు కోటి పలుకవచ్చు
వాసవాదిత్యగురురమావరులకైన। నిన్ను వర్ణింప వశమౌనె నిగమవేద్య। యి॥

సీ. బండరాతిని జేరి పండితి విది యేల హంసతూలికతల్ప మరయ లేదె
ఫణిభూషణంబులు ధరియించితి వదేల నవరత్నమయభూషణములు లేవె
బక్కయెద్దును బట్టి నెక్కసాగితి వేల గజతురంగాందోళికములు లేవె
కాలకూటవిషంబు కబళించితి వదేల నయముగా షడ్రసాన్నములు లేవె
నీకటాక్షంబు బ్రసరింప నిర్జరాళి। ధన్యులగుచుండ నీకింత దైన్యమేల। యి॥

సీ. నీకుపచారముల్ నేను జేసెదనంటె నాకేమి దోఁచదు నాగభూష
యభ్యంగనస్నాన మాచరించెదనంటె తలమీఁద గంగను దాల్చినావు
యుత్తరీయంబుల నుతికి తెచ్చెదనంటె గజచర్మమునెగాని కట్టబోవు
వంటకంబులు జేసి వడ్డింతు ననియంటె కాలకూటమె నీకు గ్రాస మయ్యె
పాదసేవను జేయంగ భ్రాంతిపడితె। ఫణుల్ వ్యాపించి యున్నవి పరమపురుష। యి॥

సీ. శంకర నీసేవ సతతంబు గల్గితే దుర్గాధిపత్యంబు దొరకినట్లు
భక్తితోఁ జింత నిన్ను భజియింప గల్గితే భూలోకమంతయు నేలినట్లు
సర్వదా నీపూజ సలుపంగ గల్గితే యీరేడులోకంబు లేలినట్లు
ముదముతో నను గాంచి మ్రొక్కంగ గల్గితే కైలాసవాసంబు గల్గినట్లు
గాన నాయందు నీకృప గలుగఁజేసి। దర్శనం బిచ్చి రక్షించు ధన్యచరిత। యి॥

సీ. వీనుల నీకథల్ వినఁగల్గితే చాలు పెద్దకుండలములు పెట్టినట్లు
కరముల నీపూజ గావించితే చాలు దొడ్డకంకణములు దొడగినట్లు
గళముతో స్మరణను గావించితే చాలు కంఠభూషణములు గల్గినట్లు
మూర్ధంబుతో నీకు మ్రొక్కఁగల్గితె చాలు కనకకిరీటంబు గల్గినట్లు
మనసులోపల సతతంబు మఱువకున్న। భువిని మిగుల నొప్పు సర్వభూషణములు। యి॥

సీ. సాధుసజ్జనులతో జగడమాడుట కీడు గురుని దూషించుట గొప్పకీడు
యగ్రజన్ములతోడ నన్నృత మాడుట కీడు పక్షసాక్షిత్వంబు పలుక కీడు
యన్యకామినులతో హాస్య మాడుట కీడు చేరి నీచుల సేవ జేయ కీడు
సభలోపలను జేరి చాడి జెప్పుట కీడు మిత్రుని ద్రోహంబు మిగుల కీడు
పరమమూర్ఖత నీదగుభక్తవరుల । నిందగావించుమనుజులపొందు కీడు। య॥

సీ. శివభక్తులను నింద సేయకుండిన జాలు సకలాగమంబులు చదివినట్లు
పరోపకార్యవిఘ్నముల్ సలుపకుండిన చాలు జపునాదియాగముల్ సలిపినట్లు
భిక్షంబు బెట్ట దప్పించకుండిన జాలు పేర్మితో సత్రముల్ బెట్టినట్లు
కోరి పెండిలి జెడగొట్టకుండిన జాలు నెలమి కన్యాదాన మిచ్చినట్లు
నిన్ను బూజింప మది నోర్చి యున్న జాలు। సర్వకాలంబు నీపూజ సలిపినట్లు। య॥

సీ. గుడ్డివానికి మంచి గొప్పయద్దము గల్గ జూచునా తనముఖమందరంబు
కుష్ఠమందున కోటికులవధూమణి గల్గ గామంబు దీర్చునా కాంక్షదీర
నతిలుబ్ధునకు చాలనర్థంబు గల్గితే జెలిమితో ధర్మంబు జేయగలడె
కుంటివానికి గొప్పగుఱ్ఱంబు గల్గితే నేర్పుతో తనశక్తి నెక్కగలడె
భక్తి మీయందు లేనట్టిపామరునకు । దివ్యమంత్రంబు గల్గ సాధించగలడె। య॥

సీ. చేరి నీచులమాట చెవియొగ్గి విను టెల్ల నీరు మూటగ గట్టి నిలిపినట్లు
తంత్రగొట్టులమాట దలయూచి విను టెల్ల లో తెలుంగక గొప్పనూత దిగుట
దుష్టులమాటకు నిష్ట మందుట యెల్ల గలలోన మేలు దా గాంచినట్లు
గుణవిహీనులమాట గురి జేసి వినుటెల్ల గొడ్డుగోవులపాలు గోరినట్లు
కదసి మిమ్మును బొగడని కవనమెల్ల । బాగనములోన వెన్నెల గాంచినట్లు। య॥

సీ. పార్వతీపతినామభజనానలంబుచే గలుషాటవుల నెల్ల గాల్పవచ్చు
బరమేశుకీర్తన భాస్కరప్రభలచే నజ్ఞానతిమిరంబు నడపవచ్చు
నాగభూషణుభక్తినావచే సంసారవార్ధి దాటగవచ్చు వరసగాను
శంకరదేవుని స్మరణామృతంబుచే బలువైనక్షుద్బాధ బాపవచ్చు
గాన నీశక్తి కుజనులు గానలేక। బద్ధులై బాధపడుదురు బుద్ధి లేక। యిరును॥

సీ. ఓంశంకరా యని యొకమారు బల్కితే పాపజాలము లన్ని భస్మమగును
నొనర రెండవమారు నోంశంకరా యన్న దురితసంఘము లెల్ల దొలగి చనును
చెలగి మూడవమారు శ్రీశంకరా యన్న బలువుగా భాగ్యసంపదలు గల్గు
జేరి నాలవమారు శ్రీశంకరా యన్న స్వర్గాధికారంబు సంభవించు
సంతతము నీదుభజన నా సలుపునట్టి। పుణ్యపురుషులు మోక్షంబు బొందు టరుదె। య॥

సీ. చిత్తంబు మీపాదసేవ గోరుచునుండు భావంబు మీనామభజన గోరు
కరములు మీపూజ గావింపగా గోరు మూర్ధంబు మీకును మ్రొక్క గోరు
జిహ్వ మీ స్మరణను జేయగోరుచు నుండు వీనులు మీకథల్ వినుట గోరు
కన్నులు మీమూర్తి గన్గొనగా గోరు కాయంబు మిమ్మున గలయ గోరు
బుద్ధి మీయందు సతతంబు బూనియుండు। గాన నను బ్రోవు వేగమే కలుషహరణ। యి

సీ. పరమందు యమునిచే బాధ నోరిదగలేక జడిసి వేగమె నీదుచరణములకు
సాష్టాంగముగ నమస్కారముల్ గావించి సన్నుతించెద నేను సాంబ నిన్ను
రక్షించు రక్షించు రక్షించుమీ వేగమే చంద్రఖండోత్తంస శరణు శరణు
పాదభక్తుని నన్ను బాలించకుండిన పరులు నాకెవ్వరు పరమపురుష
దుష్కృతంబులు వేగమే ద్రోలగజేసి। నిత్యపద విచ్చి నను బ్రోవు నిగమవినుత। యి॥

సీ. శ్రీసాంబమూర్తిని సేవింపగల్గితే నిరుపేద కర్థంబు దొరకినట్లు
నీలకంఠుని మది నిరతంబు దలచితే నింద్రసింహాసనం బెక్కినట్లు
ఫాలలోచను పూజ పలుమారు జేసితే నీరేడులోకంబు లేలినట్లు
కైలాసవాసుని గన్నుల జూచితే నరచేత మోక్షంబు నందినట్లు
గాన నీయందు సద్భక్తి గలుగజేయు। సద్గురుని జూపి రక్షింపు సదయహృదయ। యి॥

సీ. సర్వశాస్త్రంబులు జదువు సజ్జనుడైన పశదానములు జేయు దాతయైన
కన్యకాదానముల్ గావించు ఘనుడైన విప్రుల బూజించు విబుధుడైన
నిత్యసత్కర్మాది నియమవంతుండైన సత్యవాక్యము బల్కు సరసుడైన
నిరతాన్నదానంబు నెరవేర్చు నరుడైన నుపవాసములు జేయు తపసియైన
జ్ఞానమున నిన్ను గానని మానవుండు। ముక్తి జెందంగనేరడు భక్తవరద। యిరుసు.

సీ. శ్రీసాంబ నిన్ను నాచిత్తాబ్జమందున గదలకుండంగను గట్టివేసి
మోక్ష మిచ్చినదాక మ్రొక్కుచుందును గాని కరుణింపకుండిన గదలనియ్యను
మాయచేతను నీవు మరలిపోయితివేని వెదకి మిమ్మును బట్టి వేడుకొందు
వేడినప్పటికైన వెడలిపో దలచితే భక్తితో పాదముల్ బట్టుకొందు
దయకు నిధివని నిను చాలదలచియున్న। నన్ను జిక్కుల బెట్టుట న్యాయమగునె। యి.

సీ. కనకపీఠంబున శునకంబు నుంచితే గూర్చుండునా పూర్వగుణము మాని
గుడ్లగూబను దెచ్చి గూటిలో బెంచితే పలుకుచుండునె రామచిలుకవలెను
పంజరంబున గాకిపక్షి నుంచిన లెస్స కూయునే కోయిలకూతవలెను
మద్యపానికి మోక్షమంత్రంబు జెప్పితే జపము జేసునె గొప్పతపసివలెను
నీమహిమ నెంతజెప్పిన నీచనరుడు। పూజ జేసునె నిను పుణ్యపురుషవలెను। యి.

సీ. పాములతో జెల్మి బాయకుండినయట్లు పులులతో స్నేహంబు బొందినట్లు
మకరంబు గల్గిన మడుగు జొచ్చినయట్లు స్త్రీలతో వైరంబు జెందినట్లు
యేటియొడ్డున మంచియిల్లు గట్టినయట్లు చేరి నీచులసేవ జేసినట్లు
భాగ్యవంతులతోడ పంతమాడినయట్లు పరకాంతలను బల్మి బట్టినట్లు
జగతి నీభక్తవరులు దుర్జనులతోడ। జెలిమి జేసిన నెప్పుడైన జేటువచ్చు। యు.

సీ. నీభక్తవరులకు నెదురేగి సాష్టాంగదండ మర్పించిన ధన్యుఁ డొకఁడు
భక్తితో నెవరైన బలుకంగ నీకథల్ వినయంబుతో విను విబుధుఁ డొకఁడు
తనమందిరమునకు నీదాసులు జనుదేర బూజించునట్టి యాపుణ్యుఁ డొకఁడు
నేర్పుతో నెవరైన నిన్ను బూజింపంగ సంతోషమున జూచు సరసుఁ డొకఁడు
ఇట్టివారల పుణ్యంబు నెంచ వశమె। వారలకు గల్గు స్వర్గంబు వసుధలోన। యు.

సీ. దండ మొక్కటి నీకు దశరథాత్మజమిత్ర రెండుదండంబు లుద్దండతేజ
మూడుదండంబులు మురహరార్చితపాద నాల్గుదండంబులు నాగభూష
పదియుదండంబులు పద్మభవస్తోత్ర నూరుదండంబులు మేరుచాప
వేయుదండంబులు విబుధసేవితపాద లక్షదండంబులు దక్షహరణ
కోటిదండంబు లర్పింతు కోర్కెదీర। మోక్ష మిప్పించి రక్షించు మోదమునను। యు.

సీ. పలుజాడ్యములకు నీభజన జేసెదగాని వెల బెట్టి మందులు వెదుకబోను
సర్పదష్టమునకు నీస్మరణ జేసెద గాని మంత్రగాళ్ళను జేర మనసుపడను
పైశాచమునకు మంత్రభస్మధారణ గాని కుటిలరక్షలు జేయ గోరబోను
దారిద్ర్యమునకు నీధ్యాన మొనర్చెద గాని యన్యుల ద్రవ్యకాంక్ష వేడ
గల్గితివి నాకు ఘనభిషగ్వరుడ వీవు। లోకకష్టములకు నింక జడియబోను। యు.

సీ. సంతతంబున నీదు సత్కథల్ వినుచుండి పులకాంకురము మేన బొడమువాడు
నిను గాంచి వేగమే నియమంబుతోడుత సకలోపచారముల్ సలుపువాడు
నీభక్తులను కండ్లనిండ జూచియు వేగ కూర్మితో వారల గొలుచువాడు
సాధుసజ్జనులకు సదుపాయ మగునట్లు చెలగుచు భుజియింప జేయువాడు
సంతతము నీదు భక్తిని సలుపువాడు। పరమపురుషుండు భక్తుండు పావనుండు। యు.

సీ. నీలకంఠుని సేవ నియతితో గావించి చేరి బూజించుడీ శీఘ్రముగను
వామదేవుని భక్తి వదలక సతతంబు భజనగావించుడీ భద్రముగను
గరళకంఠుని పాదకమలంబులను గొల్చి స్మరణను సల్పుడీ సరసముగను
శంకరదేవుని చరణంబులకు మ్రొక్కి వినుతించుచుండుడీ వేగముగను
యమునికింకరమూర్తుల కడుదినంబు బాధ పడకుండ దెల్పెద బోధ జేసి। యు.

# ఆనందరామేశ్వరశతకము.

సీ. కష్టమానవులార నిష్ఠగా జేయుడీ నీలకంఠుని సేవ నిత్యముగను
భక్తితో ప్రియులార భావించుచుండుడీ గరళకంఠుని పాదకమలములను
శ్రమతోడ జనులార శ్రద్ధగా జేయుడీ శంకర స్మరణను సరసముగను
ప్రేమతో ప్రజలార ప్రియముగా జేయుడీ వామదేవుని పూజ వరుసగాను
యనుచు కుజనుల కిబ్భంగి నాదరమున। దెలుపుచుండును మహిలోన దేటపఱచి। ఆ॥

సీ. ఉపవాసములతోడ తపము జేసినగాని కల్గునే నీసేవ గల ఫలంబు
తీర్థయాత్రల కెల్ల దిరిగివచ్చినగాని గల్గునే నీసేవ గల ఫలంబు
సద్వ్రతంబులు చాల సల్పియుండినగాని గల్గునే నీసేవ గల ఫలంబు
చేరి యజ్ఞము లెన్ని జేసినప్పటికైన గల్గునే నీసేవ గల ఫలంబు
కానలో కందమూలాదికములు దినుచు। నిన్ను భావింపకుండిన నేమి ఫలము। ఆ॥

సీ. శివ నీదుపూజయు సిద్ధింపగా జేయు సాలోక్యపదవిని సత్యముగను
శివమహాదేవ నీసేవ కీర్తనలచే సామీప్యపదవి దా సంభవించు
నీభక్తసాంగత్య నిత్యసంభాషణ సారూప్యమును నిచ్చు సంతతంబు
తగిలి చరాచరాత్మకతను ధ్యానంబు సాయుజ్యపద మిచ్చు సౌఖ్యముగను
నాకు సిద్ధించె నిప్పుడు నాగభూష। నే కృతార్థుడనైతి నిజముగాను। ఆ॥

సీ. కన్నులు గల్గిన ఘనఫలంబునకు నీసుందరంబగుమూర్తి జూడనైతి
కర్ణద్వయంబును గలఫలంబునకు నీసత్కథాశ్రవణంబు సలుపనైతి
హస్తయుగ్మంబు నా కమరిన ఫలమునకు శ్రద్ధగా మీపూజ జరుపనైతి
జిహ్వ గలిగిన ఫలసిద్ధికి మీనామపదములు తరుచుగా బలుకనైతి
శిరము గలఫలమునకు నీక్షితిని మీకు ప్రొక్కగా జాలనైతి మోదమునను। ఆ॥

సీ. వీనులు మీకథల్ వినగోరుచుండును కన్నులు మీమూర్తి గానగోరు
హస్తయుగ్మంబు మి మ్మర్చింపగా గోరు జిహ్వ మీ స్మరణను జేయగోరు
మనసు మి మ్మెప్పుడు మరువకుండగ గోరు చిత్తంబు మిమ్మున జేరగోరు
మూర్ధంబు మీకును మ్రొక్కుచుండగ గోరు ముదముతో దృఢబుద్ధి ముక్తిగోరు
భావ మెల్లను మీపాదభక్తియందు దగిలియుండగ గోరును ధన్యచరిత। ఆ॥

సీ. పుడమిలోపల కొండేపూడి గొండయదాసు దతిభక్తి జెప్పిన శతక మెపుడు
భక్తితో పఠియించు పరమపావనులకు బుస్తకంబున వ్రాయు పుణ్యులకును
వీనుల కింపుగా విను భక్తజనులకు ధర నచ్చు గూర్చిన ధన్యులకును
ఆయురారోగ్యంబు లైశ్వర్యమును గల్గి సంకల్పసిద్ధిని జయము నొంది
పుత్రపౌత్రాభివృద్ధిని బొంది తుదిని। ముక్తులగుదురు మిము జేరి భక్తవరద। ఆ॥

సీ. పాములతో జెలిమి జేయుచుండినయట్లు పులులతో స్నేహంబు బొందినట్లు
మకరంబు గల్గిన మడుగు జొచ్చినయట్లు స్త్రీలతో వైరంబు జెందినట్లు
యేటియొడ్డున మంచియిల్లు గట్టినయట్లు చేరి నీచులసేవ జేసినట్లు
భాగ్యవంతులతోడ పంత మాడినయట్లు పరకాంతలను బట్టి బట్టినట్లు
జగతి నీభక్తవరులు దుర్జనులతోడ। జెలిమి జేసిన నెపుడైన జేటువచ్చు। యు.

సీ. నీభక్తవరులకు నెదురేగి సాష్టాంగదండ మర్పించిన ధన్యు డొకడు
భక్తితో నెవరైన బలుకంగ నీకథల్ వినయంబుతో విను విబుధు డొకడు
తనమందిరమునకు నీదాసులు జనుదేర బూజించునట్టి యాపుణ్యు డొకడు
నేర్పుతో నెవరైన నిన్ను బూజింపంగ సంతోషమున జూచు సరసు డొకడు
ఇట్టివారల పుణ్యంబు నెంచ వశమె। వారలకు గల్గు స్వర్గంబు వసుధలోన। యు.

సీ. దండ మొక్కటి నీకు దశరథాత్మజమిత్ర రెండువందంబు లుద్దండతేజ
మూడుదండంబులు మురహరార్చితపాద నాల్గుదండంబులు నాగభూష
పదియుదండంబులు పద్మభవస్తోత్ర నూరుదండంబులు మేరుచాప.
వేయుదండంబులు విబుధసేవితపాద లక్షదండంబులు దక్షహరణ
కోటిదండంబు లర్పింతు గోర్కెదీర। మోక్ష మిప్పించి రక్షించు మోదమునను। యు.

సీ. పలుజాడ్యములకు నీభజన జేసెద గాని వెల బెట్టి మందులు వెదకబోను
సర్పదష్టమునకు నీస్మరణ జేసెద గాని మంత్రగాళ్ళను జేర మనసుపడను
పైశాచమునకు మంత్రభస్మధారణె గాని కుటిలరక్షలు జేయ గోరబోను
దారిద్ర్యమునకు నీధ్యాన మొనర్చెద గాని యన్యుల ద్రవ్యకాంక్ష నేద
గల్గిన నాకు ఘనభిషగ్వరుడ వీవు। [illegible]కష్టములకు నింక జడియబోను। యు॥

సీ. సంతతంబున నీదు సత్కథల్ వినుచుండి పులకాంకురము మేన బొడమువాడు
నిను గాంచి వేగమె నియమంబుతోడుత సకలోపచారముల్ సలుపువాడు
నీభక్తులను కండ్లనిండ జూచియు వేగ కూర్మితో వారల గొలుచువాడు
సాధుసజ్జనులకు సదుపాయ మగునట్లు చెలగుచు భుజియింప జేయువాడు
సంతతము నీదు భక్తిని సలుపువాడు। పరమపురుషుండు భక్తుండు పావనుండు। యు.

సీ. నీలకంఠునిసేవ నియతితో గావించి చేరి బూజించుడీ శీఘ్రముగను
వామదేవుని భక్తి వదలక సతతంబు భజనగావించుడీ భద్రముగను
గరళకంఠునిపాదకమలంబులను గొల్చి స్మరణను సల్పుడీ సరసముగను
శంకరదేవునిచరణంబులకు మ్రొక్కి వినుతించు చుండుడీ వేగముగను
[illegible] మూర్ఖుల కనుదినంబు బాధ పడకుండ దెల్పుడు బోధజేసి। యు.

# ఆనందరామేశ్వరశతకము.

సీ. కష్టమానవులార నిష్ఠగా జేయుడీ నీలకంఠుని సేవ నిత్యముగను
భక్తితో ప్రియులార భావించు చుండుడీ గరళకంఠుని పాదకమలములను
శ్రమలతోడ జనులార శ్రద్ధగా జేయుడీ శంకర స్మరణను సరసముగను
ప్రేమతో ప్రజలార ప్రియముగా జేయుడీ వామదేవుని పూజ వరుసగాను
యనుచు కుజనుల కిబ్బంగి నాదరమున। దెలుపుచుందును మహిలోన దేటపరచి।యి॥

సీ. ఉపవాసములతోడ తపము జేసినగాని కల్గునే నీసేవ గల ఫలంబు
తీర్థయాత్రల కెల్ల దిరిగివచ్చినగాని గల్గునే నీసేవ గల ఫలంబు
సద్వ్రతంబులు చాల సల్పియుండినగాని గల్గునే నీసేవ గల ఫలంబు
చేరి యజ్ఞము లెన్ని జేసినప్పటికైన గల్గునే నీసేవ గల ఫలంబు
కానలో కందమూలాదికములు దినుచు। నిన్ను భావింపకుండిన నేమి ఫలము।యి॥

సీ. శివ నీదుపూజయు సిద్ధింపగా జేయు సాలోక్యపదవిని సత్యముగను
శివమహాదేవ నీసేవ కీర్తనలచే సామీప్యపదవి దా సంభవించు
నీభక్తసాంగత్య నిత్యసంభాషణ సారూప్యమును నిచ్చు సంతతంబు
తగిలి చరాచరాత్మకతను ధ్యానంబు సాయుజ్యపద మిచ్చు సౌఖ్యముగను
నాకు సిద్ధించె నిప్పుడు నాగభూష। నే కృతార్థుడ నైతిని నిజముగాను। యిరుహ॥

సీ. కన్నులు గల్గిన ఘనఫలంబునకు నీసుందరంబగుమూర్తి జూడనైతి
కర్ణద్వయంబును గలఫలంబునకు నీసత్కథాశ్రవణంబు సలుపనైతి
హస్తయుగ్మంబు నా కమరిన ఫలమునకు శ్రద్ధగా మీపూజ జరుపనైతి
జిహ్వ గలిగిన ఫలసిద్ధికి మీనామపదములు తరుచుగా బలుకనైతి
శిరము గలఫలమునకు నీక్షితిని మీకు మ్రొక్కగా జాలనైతి మోదమునను। యి॥

సీ. వీనులు మీకథల్ వినగోరుచుందును కన్నులు మీమూర్తి గానగోరు
హస్తయుగ్మంబు మి మ్మర్చింపగా గోరు జిహ్వ మీ స్మరణను జేయగోరు
మనసు మి మ్మెప్పుడు మరువకుండగ గోరు చిత్తంబు మిమ్మున జేరగోరు
మూర్ధంబు మీకును మ్రొక్కుచుండగ గోరు ముదముతో దుతి బుద్ధి ముక్తి గోరు
భావ మెల్లను మీపాదభక్తియందు దగిలియుండగ గోరును ధన్యచరిత। యిరుహ॥

సీ. పుడమిలోపల కొండేపూడి కొండయదాసు రతిభక్తి జెప్పిన శతక మెపుడు
భక్తితో పఠియించు పరమపావనులకు బుస్తకంబున వ్రాయు పుణ్యులకును
వీనుల కింపుగా విను భక్తజనులకు ధర నచ్చు గూర్చిన ధన్యులకును
ఆయురారోగ్యంబు లైశ్వర్యమును గల్గి సంకల్పసిద్ధిని జయము నొంది
పుత్రపౌత్రాభివృద్ధిని బొంది తుదిని। ముక్తు లగుదురు మియు జేరి భక్తవరద। యి॥

సీ. వసుధ కొండేపూడి వంశాబ్ధిచంద్రుడు చలమయామాత్యుండు జననమొందె.
వేయంత్రగను శ్రీశ్రీ శ్రీరామకోటిని భక్తితో వ్రాసెను బ్రహ్మవిదుడు
యాయన సత్పత్ని యైన సాధ్వీమణి రమణాంబ యను వధూరత్న మొప్పె
వారందపుత్రుల నెప్పు ధరిముదం బొనరించు సుతులు నల్గుర యందు జ్యేష్ఠ తనయ
శ్రీరామభక్తుండ గొండయ్య నామ ధరుడ। గౌతమసగోత్రజుం డను గవివరుండ
యిరుసుమండ నివాసుండ ధరణిసురుడ। శివుని భక్తుండ శంకర సేవకుండ.

గీ. లక్షణగ్రంథములయందు దక్షు లైన। సరసకవులార మీకు నే సంతతంబు
వ్రాసెద వేడెద మీరును ముఖ్యముగను। తప్పు లున్నను దిద్దుడీ యొప్పుగాను.

గీ. సర్వజిన్నామవత్సర చైత్ర శుద్ధ। విదియ శనివారదినమున సుదతుముసకు
కొండేపూడ్యన్వయుం డగు కొండయాఖ్యు। చేత రచియింపబడెను యీసీసశతము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీ ఆనందరామేశ్వరార్పణమస్తు.

సంపూర్ణము.

